Annual Subscription Rs. 2/-only. Reg. No. M. 2749.

A TELUGU MONTHLY JOURNAL OF INSURANCE BANKING AND FINANCE

# BHEEMA PATRICA

# భీమా పత్రిక

భీమా, బ్యాంకింగు, ఆర్థిక, వ్యవహారములను ప్రచారము చేయు మాసపత్రిక.

EDITOR:
S. KANAKARAJU PANTULU





VOL. V BEZWADA—MAY 1936 No. 5

# భీమా పత్రిక.

గౌరవపోషకులు

మ. రా. రా. శ్రీ. కె. బి. మాధవగారు, ఎం. ఏ., ఏ. ఐ. ఏ. (లండన్) ఎఫ్. ఆర్. ఎ. ఎస్.

,, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, బి. ఏ., బి. యల్.

సంపాదకుడు: సూరంపూడి కనకరాజు పంతులు.


## భీమాపత్రిక

"భీమాపత్రిక" ప్రతిమాసమున కడపటివారములో ప్రకటింపబడును. జనవరి నెలతో సంవత్సరము ప్రారంభమై డిశంబరు నెలతో సంవత్సరాంతమగును. సంవత్సరములో నెప్పుడైన చేర్చుకొనబడిన చందాదారులు, వెనుకటి సంచిక లున్నయెడల ఆసంవత్సరములో వెనుకటి సంచికలనుగూడ పొందుట కర్హులు. సంవత్సరపు చందాలు విధిగా ముందు చెల్లింపబడవలెను. వ్యక్తులెప్పుడు చందాదారులుగ చేరి పత్రిక వి. పి. గా పంపుమని కోరెదరో ఆమాస పత్రిక మాత్రము వి. పి. గా పంపబడును. వి. పి. మొత్తము చేరినతరువాత లోగడ పత్రికలు బుక్కుపోస్టుద్వారా పంపబడును. పత్రికలలో ప్రచురింపబడవలసినవిషయము లన్నియు పత్రికాధిపతిగారికి పంపవలెను. మనియార్డర్లు, వ్యాపార సంబంధమైన విచారణలు మేనేజరుగారికి పంపవలెను. వ్యాసముల వాపసుగాని, ప్రత్యుత్తరములనుగాని కోరువారు పోస్టుచార్జీల నతికించి అడ్రసు వ్రాసిన కవరు పంపవలెను. వ్యాసకర్తలు విలేఖరులు, ప్రచురణములకు పంపు విషయములలోని అభిప్రాయములకు సంపాదకులుగాని, ప్రకాశకులుగాని, ఉత్తరవాదులు కారు. సంవత్సర చందా రు 2—0—0. విడిపత్రిక రు 0—4—0.

వివరములకు: మేనేజరు, భీమాపత్రిక, బెజవాడ.

BUSINESS NOTICE.

The "Bheema Patrica" is published in the last week of every month. Subscribers who will not receive the Journal by the 15th of the succeeding month, will kindly communicate to the Manager.

The annual subscription is Rs. 2/- inclusive of postage. Single copy costs 4 annas. Subscriptions at whichever time of the year be paid, will cover the period from January to December. All business communications should be addressed to the Manager. Contributions should be sent to the Editor. Articles on matters relating to Insurance are welcome. The Editor is not responsible for the views of the contributors.

For particulars:—The Manager, "Bheema Patrica" Bezwada (S. India).

ఇందులోగల ప్రకటనాదివిషయములకు వ్రాయునపుడు "భీమాపత్రిక" అను పేరుఉదాహరింపవలసినదిగ కోరుచున్నాము.

అయ్యా!

శ్రీయుత........................................................................

గారి సలహా ననుసరించి మీకు యీ పత్రిక పంపించడమైనది. మీరు యీ పత్రికను సాదరాభిమానముతో స్వీకరించి చందాదారుగ చేరి సంవత్సర చందా రు 2/—రెండు రూపాయిలను మనియార్డరుద్వారా పంపించకోరుచున్నాను.

బెజవాడ,
తేది 29—5—36.

మేనేజరు,
భీమా పత్రిక.




# భీమా పట్టా దఖలు

## ( ASSIGNMENT OF POLICY )

### I

ప్రారంభములో ఒకరు జీవితభీమా నిమిత్తము దరఖాస్తు చేయునప్పుడు దరఖాస్తులో కంపెనీ వారిచే వేయబడు ఒక ముఖ్యమైన ప్రశ్నకు భీమా దరఖాస్తుదారు జవాబు చెప్పవలసియుండును. ఆ ప్రశ్న యీ దిగువ విధముగనుండును.

“నీవు భీమా చేయదలచుకొన్న మొత్తము భీమాకాలపరిమితి అనంతరమందుగాని యీ లోపుగ అకాలమరణము సంభవించునప్పుడుగాని ఎవరికైనను చెందునట్లు దఖలు పర్చదలచుకొన్నావా ? అట్లు దఖలుపర్చ దలచినచో ఎవరికి దఖలుపర్చదలచితివో అట్టివారి పేరును పూర్తివిలాసమును వివరింపుము.”

ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరము వ్రాయుటలో భీమాదరఖాస్తుదారునకు కొంత కష్టము లేకపోలేదు. కొంతమంది దరఖాస్తుదారులు వెంటనే భార్యపేరో తనయులపేరో పారమార్థికచింత గలవారై ఏధర్మసంస్థలకైనను దఖలుపర్చ దలచినచో అట్టి ధర్మసంస్థల ట్రస్టీలపేర్లో వ్రాయుచుందురు. ఈ ప్రకారము భీమాదరఖాస్తుకాలమందుగాని, కంపెనీవారిచే భీమాపట్టాజారీచేయబడిన వెంటనేగాని ఏ కొద్దిమంది మాత్రమో పట్టాదఖలును వ్రాయుచుందురు. కాని చాలమంది యిట్టిపనిని చేయరు. ఇందులకు కారణము లేకపోలేదు. కొన్నికొన్ని పరిస్థితులలో పట్టాలను దఖలుపర్చిన కొన్ని చిక్కులును, దఖలుపర్చక యున్న అంతకంటె ఎక్కువగు న్యాయశాస్త్రసంబంధమగు చిక్కులును సంభవించుచుండును. దఖలుపర్చిన ఒకతంటా. దఖలు పర్చక యుండిన ఒకతంటా. దఖలుపర్చినప్పుడు ఉండే చిక్కులుకంటె దఖలు పర్చకయున్నప్పుడు వచ్చేచిక్కులు చాల ఎక్కువ.

పట్టాను మొదటలో ఒకరికి దఖలుపర్చిన తర్వాత తిరిగి ఆ దఖలును మరియొకరికి మార్చుకొనుటకుగాని, రద్దుపర్చుకొనుటకుగాని భీమా పట్టాదారునకు అధికారములేదు. ప్రారంభములో చేసిన దఖలును మరియొకరికి మార్చ దలచుకొనినను రద్దుచేయదలచుకొనినను ప్రారంభములో దఖలుపొందిన దఖలుదారు అనుమతిని బడయవలెను. ప్రారంభములో దఖలుపొందినదఖలుదారు అప్పటి పరిస్థితులనుబట్టి ఒకప్పుడు ఇట్టి మార్పుకుసమ్మతింపవచ్చును. సమ్మతింపక పోవచ్చును. సమ్మతించినన రే! సమ్మతించనిచో చిక్కులు వచ్చును. సమ్మతించిన దఖలులో ఎట్టిమార్పునైనను చేసుకొనవచ్చును. సమ్మతించనియెడల అసలు భీమాపట్టాదారునకు సదరు విధముగా దఖలుపర్చిన భీమాపట్టాపై సంవత్సరవాయిదా

లను (Premiums) చెల్లించుట తప్ప మరిఏవిధమైన హక్కులును ఉండవు.

ప్రతిఫలముగా పైకమును తీసుకొని దఖలు వ్రాసిన పట్టాల విషయములోను, షరతులేమియు పెట్టక సంపూర్ణ హక్కులుతోను దఖలు (Absolute Assignment)పర్చిన పట్టాలవిషయములోను ఎట్టిచిక్కులును వుండవు. కాని ప్రతిఫలము తీసుకొనక ప్రేమసంబంధముతో కొన్ని షరతులకు లోబడి, దఖలుపర్చిన పట్టాలవిషయములో మాత్రము ఒక్కదఖలు మార్పుదలచేయదలచుకొని నప్పుడే చిక్కులు గలిగిన గలుగవచ్చును. ఈ విషయములో దఖలుదారు అనుమతి పొంది మొదటవ్రాసిన దఖలులో మార్పుదల పొందవచ్చును. మొదటలో వ్రాసిన దఖలును ఇష్టమువచ్చినప్పుడు మార్చుకొనుటకు దఖలుపొందిన దఖలుదారు తన యంగీకారమును ఇచ్చుటకు సర్వదా సిద్ధముగనున్నచో దఖలు వ్రాసినప్పటికిని చిక్కులు వుండవు. వ్రాసిన దఖలును ఇష్టమువచ్చినపుడు మార్చుకొనుటకు వీలుండదేమో అనే భయముతో పట్టాలను అసలు దఖలుపర్చక యుండుటే మంచిదికాదు. పట్టాలను దఖలుపర్చినప్పుడు ఉండేచిక్కులుకంటె దఖలు పర్చకయున్నపుడు వచ్చే ఎక్కువ చిక్కులే పట్టాలను దఖలు పర్చుటే మంచిదని సలహాచెప్పుటకు ముఖ్యకారణము. దఖలుపర్చబడినపట్టాలుపట్టాదారుచే చేయబడిన అప్పులకు ఎట్టివిధముగాను లోనుగాకయుండును.

భీమాకాలపరిమితి యనంతరమున గాని, యీలోపుగ పట్టాదారు చనిపోయినప్పుడుగాని దఖలు వ్రాయబడిన పట్టాల పైకమును కంపెనీల వద్దనుండి తీసుకొనుట బహు తేలిక. పైకము తీసుకొనుటకు సాధారణముగా ఒక నెల దినముల కంటె ఎక్కువ పట్టదు. ఖర్చుల తగులుబాటు యుండదు.

పట్టాలు దఖలు పర్చకయుండినచో అన్నియు చిక్కులే. పట్టా ఎంతకాలము దఖలుపర్చబడక యుండునో, అంతకాలము పట్టాదారుచే చేయబడిన అప్పులకు ఎప్పుడైనను కోర్టుద్వారా జప్తు చేయబడవచ్చును. భీమా కాలపరిమితి యనంతరమువరకు పట్టాదారు సజీవుడై యున్న పట్టాపైకమును పొందుటలో ఎట్టి కష్టములును ఉండవు.

కాని పట్టాను దఖలుపర్చక భీమావాయిదాకాలపరిమితిలోపుగ పట్టాదారు చనిపోవుట తటస్థించినచో భీమామొత్తమును పొందవలసిన వారసులకు ఖర్చులు తగులు బాటేగాక చాల కాలయాపనగూడ జరుగును. దఖలు చేయబడిన పట్టాలపైకము కంపెనీల వద్దనుండి తీసుకొనుటలో మామూలుపరిస్థితులలో ఒక నెలదినములు పడితే దఖలు వ్రాయబడని పట్టాపైకమును తీసుకొనుటకు కనీసము ఒకసంవత్సరము, ఒకప్పుడు అంతకు పైగా కాలముగూడ పట్టును. దఖలుపర్చబడని పట్టాలపైకమును పొందుటకు వారసులు కోర్టునుండి వారసత్వపుసర్టిఫికెట్టును పొంది వాటిని కంపెనీలవారికి పంపవలెను. అట్లు పంపిన గాని దఖలుపర్చని పట్టాల భీమామొత్తమును కంపెనీలవారు వారసుల కివ్వరు. ఇట్టి సర్టిఫికెట్టులను పొందుటకు మితములేని కాలయాపనయేగాక విశేషమగు కోర్టు పబ్లిక్ అండ్ ప్రయివేటు ఖర్చులగును. త్వరలో రావలసిన భీమామొత్తమునకు వడ్డీ నష్టముకూడ వచ్చును. కోర్టువారు వారసత్వపు సర్టిఫికెట్టు శాంక్షను చేయుటకు విచారణ సలుపునపుడు మధ్యమధ్య దురుద్దేశముతో ఎంతమందో అక్రమమగు వారసులుఅడ్డంకులు కలుగ

జేయుచుందురు. ఇవన్నియు భీమాపట్టాను దఖలు పర్చకపోవుట వలన వచ్చే ఇబ్బందులు. తమ మనస్సులో కోరికప్రకారం ఎవరికైతే యీ భీమామొత్తమును యివ్వదలచుకున్నారో అట్టి వారికి ఎట్టి చిక్కులును లేక త్వరలో యీ మొత్తమును సంక్రమింప జేయవలెననే ఎట్టిసదుద్దేశముతో భీమా చేయించినారో, అట్టివారి పేర వెంటనేదఖలువ్రాయకపోవుటవలన ప్రారంభంలో పట్టాదారుకుగల అట్టి సదుద్దేశము నెరవేర్పబడజాలక పోవుట తటస్థించి వారసులను మరింత చిక్కులపాలను చేయుటేగాక భీమా వలన సకాలములో జరుగవలసిన ప్రయోజనము కూడ లేకుండపోవుచున్నది. భీమాపట్టాదారు తన భీమాపట్టామొత్తమును ఎవరికైతే సంక్రమింప చేయదలచుకొన్నాడో ఉత్తరోత్తర అట్టి వారికి ఎట్టి యిబ్బందులును గలుగకుండ వారిపేర పట్టాలను వెంటనే దఖలు వ్రాయుట చాల ఉత్తమము.

భీమాపట్టాల వారసత్వపు విషయములో హిందూ దేశపున్యాయశాస్త్రము (Legislation) కూడచాల సందిగ్ధముగనున్నది.

ఈ విషయమున న్యాయశాస్త్రములో కొంత లోటుగలదు.

భీమాపట్టాలవిషయములోన్యాయశాస్త్రము ఇదమిద్ధమని చెప్పుటలేదు. భీమాపట్టాల వారసత్వపు విషయములో హైకోర్టుల జడ్జీలు పలువురు పలువిధముల తీర్పులనిచ్చుచున్నారు. భీమాపట్టాలపైకముల వారసత్వపువిషయములో హిందూదేశపు న్యాయశాస్త్ర చట్టములోకొంత మార్పుదల కావలసియున్నది. ఇట్టి మార్పు పట్టాదారులకు అవుసరమైన రక్షణ భీమాచట్ట సవరణకావలసియున్నది. క్రొత్త భీమాచట్టము నకుబిల్లును ప్రవేశపెట్టునపుడు పట్టాదారునకును-పట్టాదఖలుదారునకును తగిన రక్షణలుండునట్లు యీవిషయమున ముఖ్యముగ గమనించతగిన మార్పులు చేయునట్లు శాసనసభ్యులు గట్టి ప్రయత్నములు చేయవలసినదని మాప్రార్థన. ఇందులకు భీమాకంపెనీలువారుకూడ తగినట్లు సహాయపడవలెను.

ప్రస్తుతము అమలులోనున్న న్యాయశాస్త్రమును బట్టి చూచిన పట్టాలను దఖలుపర్చినప్పుడు ఉండే చిక్కులు కంటె దఖలుపర్చకయున్నప్పుడు గలిగే కాలయాపన వ్యయప్రయాస చిక్కులు ఎక్కువ గనుక సాధ్యమైనంతవరకు భీమా చేసిన వెంటనే పట్టాలను తమ యిష్టమువచ్చిన వారిలో నెవరిపేరనో యొకరిపేర దఖలువ్రాయుట యుత్తమమని పట్టాదారులు గ్రహింతురనినమ్ముచున్నాము.

## II
## అస్తమయము

ఈ నెల 15 తేదీన బెంగుళూరునగరమున ఆంధ్రవీరులును ప్రసిద్ధపురుషులునగు సర్ మోచర్ల రామచంద్రరావు పంతులుగారు స్వర్గస్థులైరని వినుట కెంతయు చింతిల్లుచున్నాము. పంతులుగారు భారతదేశముననేగాక ఖండాంతములందు గూడ ఖ్యాతివహించిరి. వారు భారతదేశమునకు చేసిన సేవఅపారము. అందులో ముఖ్యముగా ఆంధ్రదేశరహితాంగము వీరుచేసిన సేవ నెన్నటికిని మరువజాలదు. వీరికి చనిపోవునరికి వయస్సు 68 సం॥ రములు. ఆంధ్రయిన్సూరెన్సు కంపెనీలో డైరక్టరుగగూడ నుండిరి. వీరికి భీమావ్యాపారమెడల అభిమానము మెండు. ఇట్టి ఆపత్కాలంబున వీరి జ్యేష్ఠపుత్రులగు శ్రీయుత మోచర్ల శ్రీరామమూర్తిగారికిని భార్యాబిడ్డలకును మాసానుభూతిని తెలియజేయుచున్నాము. శ్రీ భగవంతుడు పంతులుగారియాత్మకు శాంతి నొసంగుగాక.



A. C. I. I.

# లండను పరీక్షలు

1935 సం॥ రం॥ ప్రశ్నాపత్రములు.

(శ్రీ శనివారపు సుబ్బారావుగారు)

ఇదివరలో యీ పత్రిక ద్వారా మొదటిభాగములో గ్రూప్ A·B లను గూర్చి వ్రాసితిని. ఇప్పుడు రెండవభాగములోని ప్రశ్నావళికి తర్జుమాచేసి వ్రాసితిని.

పార్టు. II. గ్రూపు A.

జీవితభీమా న్యాయశాస్త్రం.

3 గంటలు.

1. ఒకడు కొన్ని భీమాపట్టాలను తీసుకొనెను. అందు ఒకభీమాపట్టాను మరొకరిపేరిట తనఖాగా పెట్టెను. ఆ తనఖాగా పెట్టిన పట్టాపై అప్పు యియ్యమని కంపెనీని అడిగితే ఏమిసలహా యియ్యాలి? ఇదిగాక భీమాచేసిన వానియొక్క అవసరమును గడుపుటకు యీ విషయంలో ఏమి సలహా యిచ్చెదవు. [20 మార్కులు.

2. ఈ దిగువవాటినిగూర్చి క్లుప్తంగా వ్రాయుము:—

(ఎ) భాగస్వామిగా నున్న ధర్మకర్త.

(బి) నివాసము.

(సి) మ్యుక్త్యారునామా యొక్క అధికారములు.

(డి) ఈనాముగా యిచ్చుటకు సహేతుక కారణములు.

(ఇ) తాకట్టుగా తీసుకున్నవాడు, మళ్లీ తాకట్టు పెట్టుట.

3. రాబోవు జన్మదినమునకు 16 వత్సరముల వయస్సున్నవాడు భీమా చేసుకొనవచ్చునా? ఇరువది ఒక్క సం॥రములు వయస్సున్నవాని యొక్క పట్టాపై సరండరు వాల్యూ (అంతవరకుసొమ్ము కట్టి యికకట్టకుండా మానివేసినపట్టాకు యిచ్చేసొమ్ము) యియ్యవచ్చునా? ఈరెంటినిగూర్చి విమర్శించుము.

4. ఒకఋణస్తుడు తనభీమాపట్టాను బాకీలను తీర్చుటకు తనధర్మకర్త (ట్రస్టీ) కు దఖలు పరచెను. ఈదఖలుకాగితం 15-8-34 న పుట్టెను. 25-8-34 ననే ఆధర్మకర్త సరండరువాల్యూకు కంపెనీకి వ్రాసెను. ఈస్థితిలో కంపెనీ సరండరు వాల్యూ యిచ్చుటకు ముందు ఎట్టి జాగ్రత్తను తీసుకోవాలి? ఒకవేళ ఆపట్టాదారు చనిపోయిన పిమ్మట యీ ధర్మకర్త ఆ పట్టాధనమును యిచ్చుటకు కోరినచో అపుడు కంపెని ఏమి చేయును? [మార్కులు 25.

5. ఏజంటు చేసేపనులకు న్యాయశాస్త్రప్రకారంగా కంపెనీ బాధ్యత వహించునా? లేనిచో ఎంతవరకు లేదు? [మార్కులు 30.

6. ఒక భీమాపట్టాదారు ఎవరికి విల్లువ్రాయకుండా ప్రజాసంస్థచే నడుపబడే సంఘంయొక్క ఖర్చులతో ఒక ఆసుపత్రిలో చికిత్సను పొందుతూ చనిపోయెను. ఆ ప్రజాసంస్థయొక్క సంఘంనకు ఆ ఆసుపత్రివారు ఆ చనిపోయిన వానికి చేసిన చికిత్సకై బిల్లును పంపిరి. ఆ బిల్లుయొక్కసొమ్ము ఆ భీమాపట్టాకు మించినదై యుండెను. ఈ స్థితిలో యీ ప్రజాసంస్థయొక్క

సంఘంవారున్ను ఈ చనిపోయిన పట్టాదారు వారసులు తనుకే యీసొమ్ము రావలెనని కోర్టు వారి ధృవపత్రమున్ను (గ్రాంటు ఆఫ్ లెటర్సు ఆఫ్ ఎడ్మినిస్ట్రేషను, లేక సక్సెషను సర్టిఫికెట్టు) కంపెనీవారికి తెలిపి, సొమ్ము యియ్యమన్నారు. ఇట్టి స్థితిలో కంపెనీవారు సొమ్ము యిచ్చుటలో యింకా ఏమైనా కాగితాలు కోరవలెనా? ఈసొమ్ము వీరికిచ్చి రసీదును పొందవలెనా? [మార్కులు 20.

7. ఒకపట్టాదారు తనపట్టాసొమ్మును ఎవరికియ్యవలెనో తెలుపకుండా చనిపోయెనను కారణంతో వారసులు కోర్టువారి ధృవపత్రంతో కంపెనీకి తమకే ఆసొమ్ము రావలెనను కాగితమును పంపిరి. కంపెనీవారు ఆ వారసులకు ఆసొమ్మియిచ్చులోపున ఆపట్టాదారు ఒక విల్లును (మరణశాసనమును) వ్రాసినటుల తెలిసెను. ఈస్థితిలో కంపెనీవారు వారసులకు సొమ్మియియ్యడం ఆపవచ్చునా! ఆపితే ఏమి చర్యతీసుకోవలసి ఉండును.

ఒకవేళ యీవిల్లు సంగతి కంపెనీకి తెలియకుండా వున్నపుడే కంపెనీవారు వారసులకు ఆపట్టా సొమ్మును యిచ్చివేసివుంటే న్యాయచట్టరీత్యా నుండే స్థితిఏమిటి? [మార్కులు 15.

8. భీమాపట్టా షరతులలో ఆత్మహత్యకు సంబంధించిన షరతులు ఏమియు లేకుండా నుండే స్థితిలో ఆపట్టాదారు ఆత్మహత్యవల్ల చనిపోతే కంపెనీ సొమ్ము యియ్యాలా? వద్దా? ఆపట్టాను తనఖాగా పట్టిన ఆసామీకంపెనీని సొమ్ముఅడిగిన స్థితిలో కంపెనీ ఏమి చేయును?

9. ఎ అనువాని భీమాపట్టాపై సరండరు వాల్యూ రానప్పటికి ఆపట్టాదారు ఇన్‌సాల్వెంటుగా పరిగణింపబడెను. ఈ పట్టాదారుయొక్క ట్రస్టీ ఆపట్టాను ఆస్థితిలో ఆతనికి యిచ్చివేసెను. ఈపట్టా హామీ మీదను కంపెనీనుండి ఋణము కోరెను. ఆఋణము యిచ్చుటకు కంపెనీవారు ఎట్టి సముజాయిషీని తీసుకొని ఆసొమ్ము యియ్యవలెను? [మార్కులు 20

10. ఒకపట్టాకు ఆపట్టాదారు కట్టవలసిన వాయిదాసొమ్ములకు మరొకఆసామీ తనంతట తానే ఆవాయిదా సొమ్ములను కట్టుచుండెను. ఆస్థితిలో సొమ్ముపై వానికి హక్కుండునా? దీనికి సంబంధించిన షరతులలో నుండే మినహాయింపులేమి? [మార్కులు 10

మొత్తము 200

## పార్టు II. గ్రూపు. A.
## ఉత్తర ప్రత్యుత్తర సాంప్రదాయం.
3 గంటలు

### ప్రశ్నలు

1. జీవిత భీమాపట్టా నిబంధనలలో ప్రత్యేకంగా పట్టాను రద్దుకాకుండ నుండేషరతులు ఎందు కేర్పడ్డాయి? [మార్కులు 25

2. ఒక హెడ్డాఫీసు (ముఖ్యస్థానముకు)సంబంధించిన బ్రాంచిఆఫీసులో రెన్యూయలు ప్రీమియమునకు వుంచే లెక్కల పద్ధతినిగూర్చి వ్రాయుము. [మార్కులు 25

3. ఈదిగువ వాటికి ఏయే సమయములలో ఏయే పద్ధతితో సరండరు వాల్యూ ఇయ్యాలి?

(ఎ) సాలుసరి సొమ్ములో తేడా (డిఫర్డు అన్యూటీ)

(బి) ఒక నియమిత కాలముతో(కన్‌వర్టిబుల్ టరము అస్యూరెన్సు) కూడిన పట్టాలో కలిసేది.

(సి) పిల్లల భీమాపట్టాలో తేడాలో నున్న దానిలో సొమ్ము ఇచ్చేనాటివరకు ఆగ కుండా ముందుగాయిచ్చేది.

(చైల్డ్సు డిఫర్డు ఎస్యూరెన్సు ప్రీయరు టు డి వెస్టింగు డేటు.) [మార్కులు 15

4. తిరిగి భీమా చేయడం (రీఎస్యూరెన్సు) యొక్క ముఖ్యోద్దేశమేమిటి? ఒక కంపెనీ తనకు వాక్కున్న భీమా మొత్తంకన్న హెచ్చు మొత్తాన్ని భీమాచేయించినపుడు, ఆ హెచ్చు మొత్తాన్ని మరో కంపెనీలో తిరిగి భీమాచేయించ కుండా తనవద్దనే ఎస్టిగిలో వుంచుకొన వీలగును? తిరిగి భీమా చేయునపుడు అట్లు భీమా మొత్తము నకు వుండే ప్రీమియము రేటు, పట్టానిబంధనలు, బోనస్సు (లాభములు) పట్టామార్పులు, పట్టా సొమ్ముచెల్లించునపుడు వుండేమామూలు ఆచారములేవి? [మార్కులు 15

5. ముప్ఫై వత్సరముల వయస్సు వచ్చిన వాడు రెండు వత్సరముల ప్రీమియమును చెల్లించాక ఆపట్టాదారు తనపట్టా సొమ్మును 55 వ ఏట తీసుకొనుటకు బదులుగా 20 వాయిదాలను చెల్లించుటకు చనిపోయిన తర్వాతనే ఆపట్టా సొమ్ము యిచ్చునటులుండవలెనని కోరెను. ఈ స్థితిలో ముందు కట్టే ప్రీమియము వాయిదా సొమ్ము తక్కువగా ఉండును. ఈ పట్టాదారు కోరికను అమలులో పెట్టుటకు ఏమి ఆలోచించి ఏ పద్ధతులను అవలంబించెదవో తెలుపుము? [మార్కులు 20

6. ఈదిగువ వాటిల్లో ప్రతిదానికి ఒక్కొక్క ఉత్తరము వ్రాయుము:—

(ఎ) ఒకభీమా దరఖాస్తుదారునకు 35 వత్సరముల వయస్సుంది. ఈతడు రూ 1500 నుల జీవిత భీమాపట్టాను కోరెను. ఇటుల కోరుతూ తాను మాత్రం డాక్టరుచే పరీక్ష చేయించు కొననని స్పష్టపరచెను. ఈసందర్భంలో యీ కంపెనీకి రూ 1000 ల వరకే జీవితమును డాక్టరు పరీక్ష లేకుండా భీమాచేయుటకు వాక్కున్నదని గుర్తించుకొని యీ దరఖాస్తుదారు నకు ఏమి జవాబు యిస్తావు? ఆవుత్తరం వ్రాయుము.

(బి) ఒకపట్టాదారునకు ఆపట్టాదారు హెచ్చు బరువు గలవాడుగ నున్నాడను కారణంతో హెచ్చు రేటు ప్రీమియమును కట్టిరి. ఆపట్టా దారునకు ఆ హెచ్చుబరువు తగ్గి మామూలుగా వుండవలసిన బరువే వున్నానని తెలుపుతు ఆ హెచ్చు రేటు ప్రీమియమును ఇంతటి నుంచియు తీసివేయవలసినదిగ కంపెనీకి వ్రాసెను. దీనిపై ఏమిజవాబు యిస్తావో వ్రాయుము? [మార్కులు 30

[ఈదిగువ 7,8,9, ప్రశ్నలకు యిచ్చే జవాబులలో నిరూపించే మొత్తాలకు బదులుగా ఆ మొత్తములను తెలుపనక్కర లేకుండా ఖాళీగా వుంచవచ్చును.]

7. ఒక ప్లీడరు తనకక్షిదారు తరఫున ఒక భీమాకంపెనీకి వుత్తరం వ్రాస్తూ ఆకక్షిదారు స్త్రీ అనియు, భర్తలేనిదనియు మంచి ఆరోగ్యం లేని దనియు, ప్రస్తుతము 59 వ వత్సరము వయస్సుఅనియు మూడునెలలకు అరవైయవ వత్సరంవచ్చునుగాన అప్పటినుంచియు ఆన్యూటీ కొన్ని వేల పౌనులకు కొనుననియు తెలుపుతూ వ్రాసెను. ఈ వుత్తరముకు ఏమిజవాబు యిస్తావో వ్రాయుము. [మార్కులు 20

8. ఒకపట్టాదారు తన పట్టాకు అయిదు వత్సరములవరకే సొమ్ము కట్టగలిగి కట్టితినని యు, ఇకమీదట కట్టలేనని వ్రాస్తూ సరండరు వాల్యూయియ్యమని కోరెను. ఈ పట్టాదారు

నకు ఎటువంటి జవాబు యియ్యవలెనో వ్రాయుము. [మార్కులు 25

9. కుటుంబమున కుపకరించే భీమాపట్టాలో వివిధరకాల భీమాఏర్పాట్లు ఏలావుంటాయో తెలుపుము. (ఫామిలీ ఇన్‌కం పోలసీలో నుండే వివిధతరగతుల భీమాలు) ఇట్టి పట్టాను మీ కంపెనీవారు యిస్తూవున్నటుల తెలుపుతూ పాత పట్టాదార్లందరికి ఒకసర్క్యులరు ఉత్తరమును వ్రాయాలంటే ఏలావ్రాస్తావో వ్రాయుము [మార్కులు 25.

మొత్తము 200

పార్టు· II· గూపు A·

జీవిత భీమాలెక్కలు

మూడు గంటలు·

ప్రశ్నలు·

1. కంపెనీయొక్క ఆదాయవ్యయపట్టికను తయారు చేయుటలో (బాలన్సుషీటు) నిల్వ సొమ్ము, (కాష్‌ఆన్ హేండు) కరంటుఎక్కౌంట్సు లోనున్న సొమ్ము (బ్యాంకులలో ఎపుడుపడితే అపుడు తీసుకునే పద్ధతితో నున్న సొమ్ములను) కలిపి తయారు చేయమన్నా రనుకొనుము. ఈ సందర్భంలో ఏలాతయారుచేస్తావు. ఆలాతయారు చేయుటలో బ్యాంకులయొక్క ప్యాసుబుక్కుల లోని నిలువసొమ్ములను యీ లెక్కలోనికి తెచ్చి కనపరచెదవా? [మార్కులు 15

2. ఈదిగువవాటినిగూర్చి వివరంగా వ్రాయుము:—

(ఎ) మూలధనము (అథరైజుడు కాపిటల్)

(బి) నిలువఆస్తులు - (ఫిక్సెడ్ ఏస్సెట్సు)

(సి) దామాయిషా నగటుఖర్చు (జనరల్ ఎక్సుపెన్సెస్ రేషియో)

(డి) నామకార్థపు లెఖలు (నామినల్ ఎక్కౌంట్సు) [మార్కులు 20

3. ఈ దిగువవాటిని రోజువారిచిఠాలో వ్రాయుము:—

(i) 31 డిశంబరు 1934 న ఇన్సూరెన్సుకంపెనీ వద్దనుంచి సొమ్మువస్తుందనే హామీమీద నీ కంపెనీలోనుంచి పోలసీ నెం 1 2 3 4 5 6 రు యొక్క మరణమునకు గాను యిచ్చే సొమ్ముకు పోలసీ మొత్తము రూ 5000 రివర్షనరీ బోనసుకు రూ 1000 లు యియ్యాలి.

(ii) 31 డిశంబరు 1934 ప్రచురణల కగు ఖర్చులు కంపెనీయొక్క పరిపాలనా ఖర్చుల మీద కట్టుతూ ఆదాయవ్యయపట్టికలో యిందుకైన రూ 500 ఆదాయంక్రింద జూపాలి.

(iii) 31 డిశంబరు 1934 పెట్టుబడి సొమ్ము నుండి ప్రత్యేకపు నిధి క్రింద తీయబడిన మొత్తమును యీదిగువవారికి హామీలమీద యియ్యబడెను. కొలోనియల్ మ్యునిసిపల్ సెక్యూరిటీస్ రూ 10,000 ఫారన్ మ్యునిసిపల్ సెక్యూరిటీస్, రూ 10,000, రైల్వేయ్, తదితరముల మీద రూ 5,000 లు. [మార్కులు 25

4. సొమ్ముతీసుకోవడానికిన్ని యియ్యడానికిన్ని వుండేబేధము, జమకు, కర్చుకు వుండేతారతమ్యము లేమి? [మార్కులు 15

5. 1934 సం॥ రాంతముకు ఒక జీవితభీమా కంపెనీయొక్క ఆవర్జాలెక్కలలో ప్రతి దాని క్రింద తేల్చిన మొత్తాలను యీదిగువ యియ్యబడెను. ఈ అంకెలనుబట్టి (i) 31 డిశంబరు 1934 నకు ఆదాయవ్యయపట్టికను (ii) 31 డిశంబరు 1934 నకు రెవెన్యూ ఎక్కౌంటును, తేల్చుము.

యునైటెడ్ కింగడంలో గాని యునైటెడ్ కింగడమునకు వెలుపలదేశాలలో గాని చేసిన

వ్యాపారముకు ప్రత్యేకపు వ్రాతలు అవసరం లేదు.

పరా:—ఆదాయవ్యయపట్టికను తెలుప నక్కరలేదు.

| | |
|---|---|
| వచ్చిన వడ్డీ, లాభములు, అద్దెలు. మొ | 35,000 |
| చనిపోయిన వారి కిచ్చినవి, | 150,000 |
| పనుల యొక్క పరిమితి పూర్తి అయిన వారికి చెల్లించినది. | 80,000 |
| పట్టాలపై సొమ్ము యిచ్చుటకు అంగీకరించిన పిమ్మట యింకా చెల్లించని మొత్తము. | 10,000 |
| కమీషను. | 15,000 |
| పరిపాలనా ఖర్చులు. | 40,000 |
| ఇంటిమీదనున్న ఆస్తి. | 146,000 |
| వడ్డీ మీదయిచ్చే ఇన్‌కంటాక్సు లాభములు అద్దెలు | 49,500 |
| పరిపాలనా ఖర్చులమీద ఇన్‌కంటాక్సువారు తిరిగి యిచ్చినది. | 11 000 |
| వడ్డీ, లాభములు, అద్దెలు. | 230,000 |
| ప్రత్యేక నిధియందు కట్టినది. | 100,000 |
| లైఫ్ ఎస్యూరెన్సు ఫండు (గత వత్సరం నుండి తీసుక వచ్చిన అంకెల ప్రకారంగా) | 45,00,000 |
| తనఖాలు, అప్పులు, (పట్టాలపై యిచ్చినఅప్పుల సహా) | 10,100,000 |
| ఇయ్యవలసిన కమీషను, పరిపాలనఖర్చులు. | 5,000 |
| ఇయ్యవలసిన వడ్డీ, లాభాలు, అద్దెలు. | 25,000 |
| ఇయ్యవలసిన ప్రీమియములు. | 25,000 |
| ప్రీమియమ్సు | 400,000 |
| వాయిదాకు ముందుగానే తీసుకొన్న ప్రీమియములు | 400 |
| వాటాదార్లు మూలధనమునకుగాను చెల్లించినది. | 250,000 |
| వాటాదార్లకు యిచ్చే లాభాలలో ఎవరు అడగకుండా నున్నది. | 100 |
| ఉద్యోగములోనివారిలో అశక్తులైనవారి కిచ్చేది. | 100,000 |
| స్టాక్ ఎక్స్చేంజి సెక్యూరిటీస్. | 40,00,000 |
| సరండర్సు | 20,000 |
| రెవిన్యూనుండి ఉద్యోగములోని వారిలో అశక్తులైనవారి కిచ్చేలెక్కకు బదలాయింపు. | 8.500 |
| సొమ్ము ఈ తా: బ్యాంకులోనిసొమ్ము. | 19,950 |
| చిల్లరసొమ్ము. | 50 |

[మార్కులు 35

6. జూన్, 1910 సంవత్సరమున ఏమికారణంతో బోర్డు ఆఫ్ ట్రేడువారు ఒకఉత్తర్వును గావించిరి?

1909 ఎస్యూరెన్సు కంపెనీ ఆక్టు 2 వ సెక్షను ననుసరించి ఎస్యూరెన్సు కంపెనీ డిపోజిట్లను గూర్చి సంక్షేపముగా వర్ణించుము.

7. జీవిత భీమాకంపెనీల రెవిన్యూ ఎకౌంటులో వడ్డీ. లాభములు, అద్దెలు మొదలగు వాటినుండి వచ్చిన ఆదాయమునుండి ఇన్‌కం టాక్సు (రాబడిపన్ను) మినహాయింతురు. ఈ రాబడిపన్నును (తగ్గింపు పోగా మిగిలినరాబడి పన్ను అని వ్యవహరింతురు)

ఈ లెక్కలు తేల్చేసరికి అమలులోనున్న సాధారణపు రాబడిపన్ను రేటుకంటె ఈ రేటు చాలాతక్కువగా ఉంటుంది.

పై విషయము భీమాకంపెనీలకు రాబడిపన్ను వేయుటను గూర్చిఏమి తెలుపును?

మీ జవాబులో జీవితభీమాకంపెనీలకు రాబడిపన్నులోజూపిన తగ్గింపును (రిబేటు) గూర్చిన సందర్భములపై క్లుప్తముగా వ్రాయుము.

[మార్కులు 25

8. ఇన్‌కంటాక్సుపన్ను చెల్లించే జీవితభీమా కంపెనీలవారు అన్యూయిటీస్ ఏవిధంగా చెల్లింపగలరు? ఈసందర్భంలో ఆకంపెనీలయొక్క పన్ను యిచ్చేస్థితి ఏలాఉంటుంది? [మార్కులు 20

9. ఒక జీవిత భీమాకంపెనికి సర్వసాధారణంగా వ్రాసే సొమ్ముచిఠా (క్యాష్‌బుక్కు)యొక్క జమలకు ఖర్చులకు రూలింగు ఏలాగా వేయాలి, హెడ్డింగులు ఏలా పెట్టాలి? [మార్కులు 25

మొత్తము 200.

పాఠ్టు. II. గ్రూపు. B.

పశ్నాపత్రములనుగూర్చి మరొక సంచికలో వ్రాయుదును.

ఈ పశ్నాపత్రములను చదివిన ప్రతిభీమా ఏజంటున్నూ తమవృత్తికిసంబంధించిన శాస్త్రపరిజ్ఞానములో ఎంతవరకు వెనుకబడి యుంటున్నాడో తెలియగలదు. ఈ శాస్త్రమునకుసంబంధచిన ఆంగ్లగ్రంథముల సారాంశ మంతయు ఆంగ్లభాష రానివారందరికి తెలియునటుల ఆంధ్రములోనికి రావడం అత్యవసరమై యున్న సంగతినికూడ గ్రహించాలి. ఒకవేళ నాబోటివారు డెవరైనా వ్రాయుటకు సాహసించి ప్రచురణ చేసినా ఖర్చుకాదనేసంగతి నాకున్న అనుభవమును బట్టి స్పష్టంగా చెప్పగలను. ఆంధ్రదేశంలోనుండే భీమాకంపెనీల వారంతా కలసి యీ శాస్త్రమునకు సంబంధించిన గ్రంథములను వ్రాయుంచుటకు బూనుకోనుటం మంచిది. వారు అలాచేయుటలేని స్థితిలోనున్నా ప్రతి భీమా ఏజంట్లు సంఘం వారు ఆంధ్రదేశంలో పనిచేసే కంపెనీలవారితో వుత్తరప్రత్యుత్తరాలు జరిపి యీకృషికి బూనుకోవడంకూడా మంచిదేయని గ్రహింతురుగాక.

# భీమాసమాచారములు.

ఓరియంటల్ గవర్నమెంటు సెక్యూరిటీ లైఫ్ అస్యూరెన్సుకంపెనీ లిమిటెడ్ వారు 1935సం॥లో ఎనిమిదికోట్లు, ఎనుబదితొమ్మిదిలక్షల ఎనుబది తొమ్మిదివేల నూటనలుబదితొమ్మిది రూపాయిలు (రు 8, 89, 89, 149) మొత్తమునకు 48,858 భీమా పట్టాలను జారీ చేసియుండిరి. 1934 సం॥లో రు. 7,62,42,761 లుకు 42,378 భీమాపట్టాలను మాత్రమే జారీ చేసిరి. 1934 సం॥లో కంటె 1935 సం॥లో రు1,27,46,388లు భీమామొత్తమునకు 6,480 భీమా పట్టాలను అధికముగా జారీ చేసియున్నారు

* * * *

లాహోరు భారత యిన్సూరెన్సు కంపెనీ కాలికట్ బ్రాంచిమేనేజరుగానున్న శ్రీయుత దంతుర్తి శాంతయ్యగారు తమ ఉద్యోగమునకు రాజీనామ నిచ్చి బందరు హిందూస్థాన్ మ్యూచియల్ యిన్సూరెన్సు కంపెనీలో ప్రవేశించి రని తెలియుచున్నది.

* * *

వీనస్ అస్యూరెన్సు కంపెనీవారి గుంటూరులో నున్న బ్రాంచి ఆఫీసును బెజవాడకు మార్చి సదరు ఆఫీసుకు రాజమండ్రినుండి వెలువడుచున్న యిన్సూరెన్సు మెయిల్ పత్రికాధిపతులగు శ్రీయుత కె వెంకటావుగారిని సూపరింటెండెంటుగా ఏర్పాటుచేసినారు.

* * *

బెజవాడలో ఎండ వేడిమి ఎక్కువగా నుండుటచే యిచ్చటనున్న యిన్సూరెన్సుకంపెనీ ఆఫీసులన్నింటిని ఉదయముననే తెరచి ఉదయము గం 11-0 ల వరకు ఆఫీసుపనులను సాగించుకొనుచున్నారు.

* * *

# ఏషియన్ అస్యూరెన్సు కంపెనీ (గుంటూరు బ్రాంచి) రజతోత్సవము

### సందర్భమున చదివిన

## ప్రశంసా పద్యములు

ఏషియన్ అస్యూరెన్సు ఎల్లప్పుడును । ప్రబలి ప్రజాభివృద్ధి బొంబాయియందు
ఆర్థికపరిస్థితులతోడ నారితేరి । ముఖ్యరంగస్థలంబై పొలుచుగాత.

సీ॥ బంగారుభీమ యాత్రింబుగ గల్పించు ఏష్యనేష్యూరెన్సు నెసగి మెసగ
త్రివిధలాభపుభీమ తేజరిల్లగ జేయు ఏష్యనేష్యూరెన్సు నెసగ మెసగ
పించను ఒప్పించు భీమకాస్థానంబు ఏష్యనేష్యూరెన్సు నెసగి మెసగ
విద్యాభివృద్ధి గావించు భీమనుగూర్చు ఏష్యనేష్యూరెన్సు నెసగి మెసగ

గీ॥ మానవులకెందె హతాస్మరణభీమ, కోరినంతదవ్యము సమకూర్చుభీమ
భీమ లెన్నని గలవిందు పెచ్చుపెరుగ, ఏష్యనేష్యూరెన్సునం దెలమి కలిమి.

క॥ హైందవజనాభివృద్ధికి । హైందవసాంఘికులచేత నావాసమై
పొందగు బొంబాయిపురమున । హిందూప్రాభవము దాల్చి యిత్తతి మెఱసెన్॥

సీ॥ నీ కార్యకుశలులై నెగడెడుసరదార్లు నీయుత్సవముగను నిలచినారు
నీసేవజేయుచు ననుగొల్చువారలు ఉత్సవం బెపుడనుచున్నవారు
నీకతంబునను లక్ష్మీకటాక్షము గన్నవారి జూచెదుపారు వారివారు
స్వర్గస్థులయ్యు స్వాంతతి కాయముగూర్చగా జాలిన నేర్పరులును

గీ॥ గత్తపురరాజవుగమున కన్నులార । వన్నెగల నీదు రజతోత్సవమ్ము గాంచ
ఎన్నిదోనములనుండి ఎదురుజూచు । చున్నవారు సిగార మెన్నదగునె॥

సీ॥ అర్థశాస్త్రవేత్త న్యాయస్థానవాదియు ధర్మాత్ముడగు జమ్నదాసు మెహాత
ప్రథమంబునుండి బొంబాయిపురమున నాకధీశ్వరుడై నన్నుగడపె
యిపుడు నాపై ప్రేమసించుక తగ్గించనంచు నీమదిలోన నడలకమ్మ
ఏష్యనేష్యూరెన్సు! ఇపుడింతకంటె నిన్నతిగౌరవంబుతో నాదరించు

గీ॥ బుద్ధిబలిమిని బొంబాయిపురమునందు । అఖిలపౌరులచే గొనియాడబడుచు
మేయరుగ నెన్నుకొనబడి మెరయుచున్న । వాడు నిన్నిక చెయువిడనాడగలడె॥

గీ॥ మేనేజింగ్డయిరక్టరు మిగులజ్ఞాని । వైద్యశోధనం జుక్కానిమాడ్కి
అసలు పెడదారిబట్టనియట్లునావ । ద్రిప్పుహార్దియ రక్షించు దేవుడెపుడు॥

ఉ॥ పూనినపూన్కియందు పోలిబోని సమర్థుడు ఫోజుదా ర్ద్వివే
దీశానుభవంబుగల్గిన మహాత్ముడు చేరిననాటనుండియున్
దీనత బాసె నీకు నతితేజము వృద్ధి యపారమయ్యెని
న్నానెరవాది ఆయనను నీవనుకూలత నేలుకోదగున్॥

సీ॥ ఆంధ్రదేశమున ముఖ్యంబైన బ్రాంచితో సొరుమీరినది గుంటూరునగరు
అలరు తదాధిపత్యంబు దాల్చినపోరిడ అల్పవేతనముతో నంది నిలచి

నందనీయగుణుండు నందమూరు వేంకటాచలపతి రావు పత్రిక సత్కీర్తి
తనసుగుణమ్ము యోగ్యతయు స్వతంత్రపుశక్తి దాల్చి నాయకులతో దనరువాడు
గీ॥ అదనెరింగి యధికారమ్ము నాశ్రయించి । గౌరవమును సంపాదించి ఖ్యాతిగాంచె
విదితముగ నిట్టి సుజను మహోన్నతపదవి । కెక్కఁజేసి సర్వేశ్వరుండు రక్షించుగాత॥

గుంటూరు,
10—4—1936.

ఇట్లు,
గుంటూరు బ్రాంచి ఏజంట్లు.

శ్రీరస్తు - శుభమస్తు.

## ది ఏషియన్ యస్యూరెన్సు కంపెనీ లిమిటెడు, బొంబాయి, వారి రజతోత్సవ ప్రశంసా పంచరత్నములు.

శా॥ శ్రీరాధారమణీమనోహరుఁడు వాసిన్ భారతీయావనిన్
కారుణ్యామృత బిందువుల్ జిలికి రక్షాదక్షుఁడై నీదు వ్యా
పారంబుల్ సతతాభివృద్ధిఁగన నిన్ బాలించుచున్ లోకసం
స్థారాజంబులలో ఘనంబొసఁగుఁగాతన్! ఏషియన్ కంపెనీ! 1
సీ॥ జమ్నదాస్ మెహతా ప్రశంసాత్ముఁ డధ్యక్షపీఠంబునెక్కి నీ పేరు నిలుప
హార్డియా - ఫౌజుదార్లధికారవర్గ మంద్రగ్రగణ్యులుగాఁగ నలరుచుండ
పశ్చిమోత్తరుల వ్యాపారంబు కందని ప్రతిభ, నీ యభివృద్ధి వరలుచుండ
జాతీయభీమా నుసంస్థ లగ్రస్థానమునుదాల్ప దారిజూపిన . నంగ
గీ॥ స్వచ్ఛమగు భారతీయసంస్థామతల్లి । "ఏషియన్ యస్యూరెన్సు" నా నిలజనించి
ఇరువదయిదేండ్లు, కోట్లు నార్జించినావు । వేడ్కఁ రజతోత్సవములతో వెలయుమమ్మ॥ 2
గీ॥ పశ్చిమోత్తరఖండముల్ ప్రతిభగాంచె । ప్రాచ్యఖండంబు వెనుకంజవైచెనన్న॥
లోటుదీర్చితివమ్మ యో మేటిసంస్థ । వర్ధిలగదమ్మ సర్వదా ప్రతిభమీర॥ 3
ఉ॥ లక్షలు పంచిపెట్టి మరి లక్షలకోట్లు గడించినావు నీ
యక్షయమౌ ప్రచారమహిమాతిశయంబు నుతింప శక్యమే
దక్షులు కార్యవర్గమున దర్పమునన్ జరియించుచుండ నీ
పక్షమునన్ శుభోన్నతుల భారతభాగ్యయశుండు గూర్పఁడే॥ 4
గీ॥ భరతదేశంబునకు మహాభరణమైన । మాదుగుంటూరుపురంబు నీ మహిమమెచ్చ
గలిగె, చలపతిరాయుండు కార్యదర్శి । నారసింహాఖ్యు డుత్సవ నాథుఁడయ్యె॥
జయజయధ్వానముల సంతసాబ్ధినోల
లాడగదవమ్మ "ఏషియన్ అస్యూరెన్సు"॥ 5

ఏషియన్ పాలసీదారుల సంఘము, గుంటూరు.

# Address

TO

M. R. RY.

## Nandamuru Venkata Chelapatirao Pantulu Garu,

**Manager, The Asian Assurance Co , Ltd.,**

GUNTUR BRANCH, GUNTUR.

Respected Sir,

WE the agents of the Assian Assurance Co., Ltd. working under the Guntur Branch, assembled here on the felicitious occasion of the Silver Jubilee of the Company, take this opportunity of expressing our feelings of respect and love to you.

You have been to all of us, a sincere and true friend all through, ever ready to help and guide us. It is not too much, if we say, that it is due to your careful and strict control and management, that the Branch has achieved its present growth and popularity, while at the same time it is your kind and generous treatment of the agents, that binds them all to you and encourages them to exert to their best. This is amply proved by the fact, that your branch maintains its ever increasing output of business, inspite of the fact that two Branches at Madras and Vizianagaram have recently been created out of your jurisdiction and a good many agents of the respective areas are transferred to those Branches. Further your frequent touch with all of us is ever an incentive to urge us to show better results, year after year.

Your unostentatious life, not actuated by a sense of official superiority, coupled with a tenacity of purpose and fair treatment to all, alike, has endeared you to both the agents and the policy holders. Your perfect fidelity and rectitude in the discharge of your duties, have earned for you appropriate appreciation and recognition at the hands of your superiors.

Fervently praying that God may grant you many more years of long life and prosperity and happy service in the company, which is so well appreciated, both by the company and the agents,

We beg to remain,

Respected Sir,

Yours Respectfully,

THE AGENTS, GUNTUR BRANCH.

Guntur,
10—4—36.

# Selection of Lives

*( From Medical point of view.)*

**Lecture delivered by Dr. D. P. Banerji, M. B., of the Carmichael Medical College and After-Care Officer of the Student's Welfare Committee, Calcutta University, on Friday the 29th November 1935.**

Mr. President and Gentlemen,

I feel myself greatly honoured by your kindly asking me to deliver a popular lecture this evening on a very important subject on which a medical man may throw some amount of light. Being connected with many insurance companies both Indian and non-Indian, I may claim to have gathered some amount of experience as to the difficulties a field worker meets in securing cases. I have always noted these very carefully and I shall present some of these before you this eveuing. It will be a real satisfaction to me if what I shall say now goes, even to a small extent, to improve the quality of business.

The subject for this evening is "Selection of Lives." Being a medical man I shall deal with it from the medical stand point only leaving other aspects to the experts in this art.

The selection of lives in the business of Life Insurance is, as you all know, the most important factor. Much trouble, time and expense could be saved if those who are entrusted with the work of securing new cases for insurance could select only those cases which could pass as first class lives. Workers no doubt use their ordinary common sense in selecting a person who apparently looks healthy. Sometimes enquiries are also made about the health of the prospects. But instances are not rare in which the field workers get disappointed and disheartened when proponents, secured by them with considerable amount of trouble and not unoften with some amount of expense out of their own pockets, are declared totally or partially unfit by the medical examiners as a result of which the cases are either rejected or accepted with a heavy loading which the proponents naturally resent. This happens even inspite of the best of motives on the part of the field worker to select a good life, for in many cases the outward appearance is deceptive. It is therefore desirable that all insurance men should have a good knowledge of the art by which all phases of character and signs of ill health or disease can, to some extent, be ascertained or even guessed from the outward appearance of a person. This art is technically called the art of "Physiognomy." It should not be understood that this art lays down a definite and systematic basis of study but it is rather more suggestive than logical. Every one of us practises physiognomy throughout our life unconciously. This unconcious acquisition of this particular art will be more augmented and the common sense more developed if only care is taken to bear in mind the helpful suggestions that I am giving you to-night. Avoiding all technicalities I shall deal exclusively with the most important and visible points in serial order from head to foot which can be detected conveniently even by non-medical men.

Before beginning with the actual points I am tempted to observe here that what I shall now tell you could be made more instructive and clear, if all of them could be illustrated with the help of lantern slides, for in that case you would have been able to carry in your mind a vivid picture and a very clear impression of the points raised. But still even in the absence of that I shall try to elucidate them as far as possible.

### Head

Field workers meet many people everyday professionally or otherwise. If they are a bit inquisitive, they may have marked people — although very few—having odd-shaped heads. Sometimes we come across people having heads, the shape and size of which is either much above the average or below it. This uncommon size of the head should at once remind us that the large head is diseased for it may contain something else than brain substance — such as a large amount of fluid or some sort of growth, etc. Whereas the unusually small head indicates idiocy as it generally contains lesser amount of brain substance Persons having such heads should not be got insured. This is not merely because of the abnormality of the head but also because these cases are generally associated with defects in other parts of the body.

### Hair

To an uninquisitive field worker absence of abundance of hair on the head of a person does not seem material. But this is not quite so. You may have marked the complete absence of hair on the head of a person. Any non-medical man will at once advise him to use the best hair oil in the market which will give him a luxuriant growth of hair and will not find anything serious to suspect in the total absence of hair. But it will be prudent for him instead to suspect that the person is syphilitic especially if the baldness has come out in irregular patches. As the total absence of hair indicates disease so also the thick growth of fine hair indicates that the person is generally more intelligent than the common run of men. Persistent irregular patches of baldness or complete absence of hair due to syphilis is almost always associated with other symptoms of the disease and thus renders a person uninsurable.

### Fore-head, Nose, Ear & Cheek.

In these parts of the body there are many things worth noticing for, as I shall now point out to you, they indicate some very serious types of disease, *viz.* leprosy and syphilis which surely are a bar against insurance.

Red patches of elevated and thickened skin on the forehead, nose, prominence of the cheeks and margin as also the lower soft part of the ears give the person a peculiar appearance which is called " Leonine (lion like) face." These marks are typical of leprosy. Then again where there are small eruptions on the forehead only, which appear every now and then, the person can, without doubt, be taken to be syphilitic. This eruption is called " Reminder " or the " Crown of Sin."

The depressed bridge of the nose, if not due to injury and accompanied by nasal voice, tells us again that the owner of the nose is syphilitic, while the red nose should set us thinking that the person is addicted to alcohol.

### Face & Mouth

You all know the popular expression that 'Face is the index of the mind.' This is very true in the sense that of all other parts of the body, face has the special significance of giving expression of bodily or mental suffering. A healthy man undoubtedly looks cheerful, while one suffering from a disease is not so. Mental worries are also readable on the face of a man.

I have just dealt with the major portion of the face under the heading forehead, nose, ear and cheek. Some points regarding the mouth are left to be said.

When you find that there are cracks at the angles of the mouth which are not temporary but persisting throughout the year, you can at once come to the conclusion that the person is syphilitic. Constant dry and parched lips show that the person is diabetic. Thesemake a person unfit for insurance. Simple facial paralysis due to cold is not a bar against insurance, as it is easily curable.

### Teeth

It is not always possible for the field workers while interviewing a proponent to detect any disease of the teeth and gums. But they should cleverly take the possible opportunity of watching the teeth and gums which are liable to be exposed while speaking, smiling or laughing. The swollen gums and pus at the root of the teeth are invariable signs of pyorrhœa which, if neglected, may lead to serious consequences and therefore are likely to be rejected by the companies. This disease is generally due to want of proper cleanliness of the mouth and teeth. Caries of the teeth occuring in adults and erosion of teeth are often an indication of diabetes.

### Eyes

It will be interesting to learn that both the upper and lower eyelids of drunkards and debauches have a relaxed and wrinkled appearance as in them the muscles lose their normal tension and become weak and flabby. Drooping of the upper eyelids *i.e.* where a person cannot open his eyes properly — generally occurs in syphilitic persons; but this may also be congenital. The puffed up and swollen appearance, under the eyes is an indication of kidney disease, while the yellow tinge of the eyes, which is called jaundice, is common in liver disease, gallstone, kala-azar and chronic malaria. In cases of aged persons whose age is generally above 45 years, a peculiar feature of the eye is apparent in the form of a greyish ring round the circumference of the cornea (the black of the eye) called the "arcus senelis" or senile circle. The congenitial drooping of the upper eyelids is not uninsurable as also persons having defective vision if corrected by proper glasses.

### Neck

The neck may give us indications of some very serious disease which may render a person uninsurable. You must have come accross people with short and thick neck. Such a neck in adult age, especially if the person's weight is much above normal, generally indicates high blood pressure and also susceptibility to diabetes. Numerous scars and chains of enlarged glands around. the neck suggest predisposition to tuberculosis so that the person is almost sure to contract phthisis later on.

In this connection it should be noted that cases of goitre should be scrupulously avoided. If there is visible pulsation or throbbing on the sides of the neck, heart disease may be suspected.

### Chest

Although ordinarily there is little chance of finding a prospect with naked chest and abdomen yet there may be occasions when they may be found so. Hence it is advisable that the worker should be well equipped with all information as far as possible. When a worker has such an opportunity, he should mark the shape of the chest which is outwardly visible. The pigeon shaped chest is liable in later stages to develop phthisis. There is also a barrel or round-shaped chest which is an indication of chronic asthma.

Cough, which is outwardly detectable, is always present in all diseases of the lungs. In long continued i.e. chronic lung diseases, *viz* suspected cases of phthisis and asthma, though fever is absent, the cough is always there. The peculiarity of cough of the suspected phthisis is that it is dry, hacking and fruitless while in that, due to asthma, a large amount of matter i.e. phlegm comes out at each cough.

In the naked chest if there is heart beat prominently seen near the position of the apex of the heart i.e. near about the left nipple, it is an indication of heart disease. The difficult breathing, specially after slight exertion such as walking up a few steps or a few paces or even after talking for some time, indicates that either the heart or the lung is defective or inefficient. These are symptoms of beri-beri heart or asthmatic lung. Applications from people suffering from asthma mild or severe is not generally accepted by the insurance companies.

### Abdomen

In tropical countries where tropical diseases like malaria and kala-azar are very common, the abdomen should not be allowed to go neglected, for the typical enlargement of spleen in kala-azar cases and both liver and spleen in malaria can be ascertained by looking at the abdomen alone in later stages. Very big enlargement of the abdomen may be due to accumulation of fluid inside it in later stages of kala-azar, liver and kidney diseases. In this connection it must not be forgotten that in some persons there is accumulation of fat in the abdomen which causes its enlargement and is quite normal. In women the enlargement of the abdomen in later stages of pregnancy should not be taken as abnormal although not fit for insurance. In females specially tumours of different varieties inside the abdomen may cause its enlargement and in such cases the lives are not acceptable.

### Arms & Hands

Careful and visual examination of the arm and hand may give us clue to the detection of a few diseases which render a person uninsurable. One can very easily detect a paralysed arm at a glance from the absence of its movement although the arm may not be thinned out which is common in several nerve diseases of the arm. One should not confuse this factor with the deformity of the arm or hand which may be natural or acquired and which does not make a person unfit for insurance. But the tremors of the hand always

indicate nerve disease, if it is not due to alcoholism or old age in which cases also the person is uninsurable. When the hand is thinned out and there are ulcerations at the ends of the fingers, the possibility is that the person has been affected with leprosy. Club shaped fingers appear in a person affected with chronic heart or lung disease. Amputation of one hand is acceptable if due to injury or accident but double amputations due to any cause are not acceptable.

## Legs & Feet

It is not difficult to detect the common diseases of the legs since they are visible at a glance. Paralysis of the leg is more common than the paralysis of the arm. It is detected by either the total absence of or defective movement of the limb. But you must remember that persons with deformed legs, congenital or acquired, are insurable without any extra charges When the whole leg is thickened, it suggests filarial disease and this is generally associated with a big scrotum. Though it is not a fatal disease in itself, yet such cases are accepted with extra charges. Now-a-days we must not forget that the swelling of the leg and foot may also be due to beri-beri. Heart disease or kidney disease may cause swelling of the foot also. Ulceration of the toes and the thickening of the skin of the foot is common in leprosy. The varicose i.e. thickened, enlarged and knotty condition of the veins of the leg which is due to the accumulation of venous blood inside the veins, may involve serious risk of life as it may cause profuse bleeding from even very slight injuries and makes a person unfit for insurance. Persons with varicose ulcers are always rejected by medical examiners owing to their liability to severe bleeding at any time Amputation of one leg due to accident or injury is acceptable but double amputations are not.

## General nutrition

The constiution and condition of nutrition can, to a certain extent, be ascertained by inspection only even by non-medical men. Thus those with feeble constitution may generally be said to be more in danger of an attack of acute disease than those who are robust and healthy. But men with flabby or with robust health with short thick neck and with excessive weight generally become victims of apoplexy or blood pressure and so are generally rejected.

White patches on the skin commonly called leucoderma is not leporsy, as is supposed by the general public. It is not an infectious disease and is caused by the loss of the colouring matter of the skin and is quite harmless. Hence a person with leucoderma, even if extensive, may safely be got insured if otherwise healthy.

I have already dealt with briefly the visible symptoms on the body of a person which may make him unfit for insurance. But there are many other points which the field workers should not lose sight of. Companies should issue general instructions in this respect to their workers to enable them to work successfully.

It is natural that the risk of death is to a certain extent dependent upon a person's occupation. Hence persons engaged in occupations which are generally regarded as hazardous i.e. acid

makers, manufacturers of explosives, electricians dealing with live wires, taxi drivers, engine drivers, aviators etc., should be taken with certain amount of caution. Persons living in the same house with a patient suffering from phthisis or leprosy should be avoided on account of the possible infection which may appear in the form of regular disease even in distant future. Frequent urination is a symptom of diabetes in elderly persons and gonorrhoea in younger persons. Insanitary surroundings also shorten the life of a man. Hence this factor should demand due consideration.

While concluding I must thank you for your kindly giving me a patient hearing. From what I have told you this evening many of you, I am afraid, may carry the impression that the securing of insurable cases may be unduly hampered by the application of this knowledge. To such of you, gentlemen, my humble advice would be to stick on to what I have said and bear it constantly in your mind, and I am sure that both your company and yourself will, as a result, be the principal gainers in the long run.

—Indian Insurance Institute.

# Condolences

A condolence resolution was passed by the Directors of the Andhra Insurance Company Ltd., Masulipatam, on the 21st instant expressing their sense of deep sorrow and irreparable loss at the untimely demise of Sir Mocherla Ramachandrarao Pantulu Garu and Mr. P.V. Doss who were members of the Directorate.

The Directors recorded their grateful appreciation of the services rendered by both of them to the Company.

The Directors also resolved to close the Office on Monday 25th May as a mark of respect to their memory.

It was further resolved to instal their Bromide enlargements in the Office Hall of the Company.



Reg. No. M. 2749.



Printed and Published by the Editor at the Andhra Grandhalaya Press, Bezwada.